# బాబా ఫరీద్ - సూక్తులు

డా. ఇలపావులూరి పాండురంగారావు

ప్రచురణ :




రిజిస్టర్డ్ నెం. 1/64.

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

**BABA FAREED SUKTULU;**
Some Stanzas of Baba Fareed (12th Century AD)
The First Punjabi Poet;
Explained in Telugu by :
Dr. I. PANDURANGA RAO

---



యువభారతి

ప్రచురణ : 116

ప్రథమ ముద్రణ : సెప్టెంబరు, 1986

ప్రతులు : 2200

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ : సువర్ణ ముద్రణాలయ,
నల్లకుంట, హైదరాబాద్-500 014.

ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : రూ. 5-00



భావయోగి బాబాఫరీద్ సూక్తులు

# మాట మాట

"మజహబ్ నహీఁసిఖాతా ఆపస్ మేఁ బైర్‌రఖ్నా
హిందీ హైఁ హమ్ వతన్‌హైఁ హిందూస్తాఁ హమారా"

మతం, (ధర్మం) పరస్పర విద్వేషాన్ని ప్రబోధించదు. నేర్పదు. మన మంతా భారతీయులం. భారతదేశం మనది.

స్వాతంత్ర్య సమరం మహోధృతంగా జరుగుతున్న రోజుల్లో ప్రసిద్ధ ఉర్దూకవి అల్లామా ఎక్బాల్ వ్రాసిన 'హిందూస్తాన్ హమారా' గీతం దేశీయుల హృదయాల్లో ప్రతిధ్వనించింది. ఇప్పటికీ ఉత్తేజాన్ని ఉద్దీప్తం చేస్తున్న సాముహిక గేయంగా యువతరం జిహ్వాగ్రాలపై చైతన్య తాండవం చేస్తున్నది. ఈ గేయం ఉర్దూ భాషలో వున్నా, సర్వ భారతీయుల మహత్వాకాంక్షలకు ప్రతీకగా వున్నది. భారతీయ భాషల్లో కనిపించే వైవిధ్యం కేవలం బాహిరమైనదే. ఒకే మట్టితో తయారైన రకరకాల పాత్రలవంటివే భారతీయ భాషలు. వాటిలో ప్రతిఫలిస్తున్న అందాలూ, ఆదర్శాలూ, ఆచారాలూ, ఆలోచనలూ ఒక్కటే. అప్పుడెప్పుడో ఈ భరతఖండాన ప్రభవిల్లిన వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు, జానపదగాధలు ప్రసరించిన వెన్నెలలే ఈ భాషల పలుకుబళ్ళలో, తోటల్లో, జనపదాల్లో, కవితల్లో కురిసినవి. నిన్నటి భారతదేశంలో నాలుగైదు భాషలు నేర్చినవాడే బ్రతుకనేర్చినవాడు. దేశం నలుమూలలా తిరుగగలిగిన వాడు. తన తెలివితేటలకు సార్థకత చేకూర్చుకొనగలవాడు. యావద్భారతకీర్తి నార్జించుకొనగలవాడు. నిన్నటి మన తెలుగు కవులలో ఇంచుమించు అందరూ

మూడునాలుగు భాషలలో అంచులు ముట్టిన అభినివేశం సంపాదించుకున్నవారే. నిన్నటి తరం జాతీయనాయకులకు కనీసం రెండు మూడు భాషలతో చక్కని పరిచయం ఉండేది

తన భాష తియ్యనిది గనుక, తన భాషతప్ప మరో భాషతో తనకు ప్రమేయంలేదు అనుకోవడం వివేకం అనిపించుకోదు. తన భాష స్వచ్ఛమైందనీ, మరే భాషతో దానికి సంబంధం లేదనుకునీ ఇతర భాషలను దూషిస్తూ ఉండటం శాస్త్రీయంకాదు. సభ్యత అంతకంటే కాదు. తన భాషే గొప్పదనీ, దానిద్వారా తనకు తెలిసినదంతా సత్యమనీ, తాను నమ్మిందే సిసలైన జ్ఞానమనీ, తాను తెలుసుకోవలసిందేమీలేదనీ అనుకోవడం కేవలం అజ్ఞానంతప్ప మరేమీ కాదు. "ఆనో భద్రాః క్రతవోయన్తు విశ్వతః" (ఉత్తమ భావాలు అన్ని వైపులనుంచీ మనవైపుకు రావాలె) అన్న వేదోక్తి దృష్టి వైశాల్యాన్ని అలవరచుకొమ్మని ఆదేశిస్తున్నది. వేదకాలం నుంచి మనీషులు మన దేశంలో తాత్త్విక చింతన చేస్తూ తమ జీవితానుభవాలపట్ల తమకు లభించిన జ్ఞానాన్ని కవితాత్మకంగా అందిస్తూనే వున్నారు. సంస్కృతంలో, ప్రాకృతంలో, హిందీలో, పంజాబీలో, మరాఠీలో, గుజరాతీలో, తమిళంలో, బెంగాలీలో, తెలుగులో, కన్నడంలో ఇంకా మరెన్నో భాషల్లో, పాటల్లో, పద్యాల్లో అందించినారు. సామాన్యులు మాట్లాడుకునే భాషలో యీ తాత్త్విక భావాలు చక్కని ఉపమానాలతో వెలువడినవి. సామాన్యులు సరే! అసామాన్యులుకూడా యీ పాటలను పవిత్రంగా భావించి తమ ప్రమాణ గ్రంథాల్లోకి, పూజ్య గ్రంథాలలోకి ఎక్కించుకున్నారు. మహా భక్తుడు, మహా తపస్వి, మహిమాన్వితుడు, ఆత్మసాక్షాత్కృతిని పొందజాలిన గురుశ్రేష్ఠుడు గురునానక్ పంజాబీ భాషలో వెలసిన తొలిరచనలైన బాబా ఫరీద్ సూక్తులను గ్రంథ్ సాహెబ్‌లో చేర్చుకుని వాటికి చరితార్థతను కల్పించినాడు. బాబా ఫరీద్ పంజాబీ భాషకు ఆది కవి.

సంస్కృతంనుంచి ప్రాకృత భాషలు కొన్ని పుట్టినవి. వాటినుంచి కొన్ని అపభ్రంశ భాషలు పుట్టుకొచ్చినవి. ఆ అపభ్రంశ భాషలు మరికొన్ని ఆధునిక

భారతీయ భాషలకు నారు పోసినవి. సంస్కృత, ప్రాకృత భాషల పదజాలం, వ్యాకరణాలు, ఛందస్సు, సామెతలు, ఇతిహాసాలు, కథలూ యీ భాషలకు వారసత్వంగా సంక్రమించినవి. సంస్కృత ప్రాకృత జన్యాలేకాక ద్రవిడ భాషా కుటుంబానికి చెందిన భాషలు కూడా కొన్ని వున్నవి. ముఖ్యంగా దక్షిణ భారతంలో. ఉత్తర దక్షిణ భాషలన్నీ సంస్కృత ప్రభావానికి అతిమాత్రంగా లోబడినవే. సుమధురములే. గంభీర భావద్యోతకములే. ఉత్తమ సాహిత్యాలను రాశిపోసినవే. అన్ని భాషలు జాతీయ భాషలే. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వాటితో పరిచయాన్నో, సంబంధాన్నో, పెంపొందించుకోవడంవల్ల, సమైక్య శక్తులకు దోహదం కలుగుతుంది.

సాహిత్య సాంస్కృతిక సంస్థలు సాధించవలసిన లక్ష్యం జాతీయ సమైక్యం.

యువభారతి కడచిన 22 ఏళ్ళుగా 115 పుస్తకాలను ప్రచురించింది. తెలుగు సాహిత్యవికాసానికి తోడ్పడే గ్రంథాలతోపాటు భారతీయ సాహిత్యాన్ని, తెలుగువారికి పరిచయం చెయ్యాలన్న దృక్పథంతో సూరదాస్ కవితా వైభవం. తులసీదాస్ కవితా వైభవం, తమిళ సాహిత్యం-భారతికవిత, కన్నడ కవితా సౌరభం, ప్రేమచంద్ జీవితం—సాహిత్యం అన్న పుస్తకాలను ప్రచురించినాము

ఇప్పుడు పంజాబీ భాషకు శ్రీకారంచుట్టిన బాబా ఫరీద్ సూక్తులను తెలుగు అనుసరణతో అందిస్తున్నాను. బాబా ఫరీద్ 12వ శతాబ్దానికి చెందిన మహనీయుడు. ఇస్లాం మతానుమాయి. అయినా ఆయన సూక్తుల్లో మతం గీసిన గీట్లేమీ కనిపించవు. ముస్లిములు భారతదేశములో స్థిరపడిపోయి, ఇక్కడ ప్రజలతో కలిసిపోవడానికి ఫరీద్‌వంటి మహనీయులే కారణం. ఏడువందల ఏళ్ళలో సమైక్య జీవనసరళికి అనువైన ఆలోచనలను, బ్రతుకుతీరును అందించినవారు, ఫరీద్‌వంటివారే. బాబా ఫరీద్ తత్త్వ చింతన ఉపనిషత్తుల బాటలలోనే సాగింది మన భక్తి సాహిత్యం అడుగుజాడల్లోనే నడిచింది. బాబా ఫరీద్ సూక్తులను

అచ్చమైన తెలుగు నుడికారంతో అందించిన మనీషులు — డా. ఇలపావులూరి పాండురంగారావు. డా. పాండురంగారావుగారు సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర, హిందీ భాషా సాహిత్యాలతో తలస్పర్శి అభినివేశాన్ని సంపాదించిన విద్వాంసులు. మా యువభారతికి 'సూరదాస్ కవితా వైభవం', 'ఉపనిషత్సుధ', 'రామాయణ పరమార్థం' అనే గ్రంథాలను వ్రాసియిచ్చి ప్రచురించుకునే అవకాశం కల్పించిన ఉదార హృదయులు. హిందీలోనూ, తెలుగులోనూ అనేక కవితలను, వ్యాసాలను, వ్యాఖ్యానాలనూ వెలయించి సమున్నత ప్రమాణాలందుకున్న సాహితీ స్రష్టలు

"భావయోగి బాబా ఫరీద్ సూక్తులు" అనే పుస్తకాన్ని రచించి, ప్రచురించుకునే అవకాశాన్ని కల్పించిన డా. ఇలపావులూరి రంగారావుగారికి కృతజ్ఞతాపూర్వకమైన అభినందనములను సమర్పించుకుంటున్నాను.

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు

# బాబా ఫరీద్

## (1173 - 1266)

ప్రపంచంలో ప్రాణికోటికి ప్రాణశక్తిని ప్రసాదించే ప్రాణనాడి ఒక్కటే. జీవధారులు వేరయినా జీవధార ఒకటే. శరీరాలు వేరయినా ఆత్మ ఒకటే, భాషలు వేరయినా భావవాహిని ఒకటే. మతాలు వేరయినా అభిమతం ఒక్కటే. మానవ జీవితంలో మతానికి గల ప్రాశస్త్యం, ప్రాచుర్యం మరో జీవిత తత్త్వానికి లేదు. అర్థం, ఆలోచన, ఆనందం జీవితానికి కావలసిన మూడు ముఖ్యావసరాలు. ఈ మూడింటికి మూలం ఏమిటని మహనీయులు ఆలోచించారు. ఎడతెగని ఆనందంతోపాటు నిరంతర శాంతిని సాధించేందుకే ప్రపంచంలోని అన్ని మతాలూ ప్రయత్నించాయి. మత ప్రవక్తలు ఈ శాంతి పాఠాన్నే వేరు వేరు భాషల్లో, వేరు వేరు పద్ధతుల్లో ప్రవచించి వివరించారు. అందరి లక్ష్యం ఒకటే. ఆ లక్ష్యాన్ని వేరువేరు లక్షణాలు ప్రత్యక్షీకరించుకున్నాయి. లక్ష్యంలో మార్పు లేనప్పుడు లక్షణం ఎలాంటిదయినా వైవిధ్యం పెరుగుతుందేకాని, విరోధం ఏర్పడదు.

మాటిమాటికి అనేకత్వంలో ఏకత్వం సాధించి అన్ని మతాలలోని ఏకాత్మ ప్రత్యయసారాన్ని చాటిచెప్పే సాత్త్విక తపస్సంపన్నులు, సాధుపుంగవులు, మత గురువులు మనదేశంలో అనేకులు జన్మించారు. వారి బోధనలను జాగ్రత్తగా గమనిస్తే మహనీయులయిన మత ప్రవక్తలు ఒకే తత్త్వాన్ని, ఒకే సత్యాన్ని ప్రబోధించారనే విషయం స్పష్టమవుతుంది. ఇలాంటి మహనీయుల్లో ఎన్నదగినవాడు బాబా ఫరీద్.

మహమ్మదీయునిగా జన్మించి, పంజాబీ భాషలో తన ప్రబోధ గీతికలను ప్రబంధించి, అన్ని మతాలలోని మూలతత్త్వాన్ని మధుర

మయిన భాషలో మానవ జాతికి అందజేసిన భావయోగి బాబాఫరీద్. ఇలని రచనలను చూచి సిక్కులకు ఆదిగురువయిన గురునానక్ ముగ్ధు డయి వాటిని తమ మత మహత్తుకు చిహ్నమయిన 'గ్రంథ సాహబ్'లో చేర్చుకొనడం గురునానక్ ఔదార్యానికేకాక బాబా ఫరీద్ భావగరిమకు కూడా నిదర్శనం. బాబాఫరీద్‌కు ముందు పంజాబీ భాషలో గ్రంథ స్థమయిన సారస్వతం కనిపించదు. ఆ విధంగా ఆయన పంజాబీ సార స్వతానికి ప్రాణప్రతిష్ఠ చేసిన ప్రథమ కవి అయినారు. ఆయన రచన లను ఆ రూపంలో ఏదో సాధారణమయిన ప్రచురణలో కాక చిర స్థాయిగా నిలబడగల, నెలకొనవలసిన గ్రంథసాహబ్‌లో చేర్చి, అటు సాహిత్యానికీ, ఇటు ఆధ్యాత్మిక సంపదకూ ఎనలేని సేవ చేసిన గౌర వం గురునానక్ దేవునికి లభించింది. ఈ విధంగా బాబాఫరీదు ప్రవ చించిన భావయోగం మత సామరస్యాన్ని సాధిస్తూ సారస్వత నవనీ తాన్ని కూడా సహృదయలకూ, హృదయజ్ఞులకూ అందజేసింది. మత దృష్టితో చూస్తే మహమ్మదీయమతంలో అంతర్భాగమయిన సూఫీ సంప్రదాయానికి సూక్తిముక్తావళిని ప్రసాదించిన ప్రవక్త బాబా ఫరీదు. సారస్వత జగత్తులో పంజాబీ భాషకు ఆదికవి.

బాబా ఫరీద్ జీవితమే ఒక సమరసగాథ. అన్యాయం, అక్రమం, అవినీతి, అత్యాచారం విచ్చలవిడిగా విహరించే కాలంలో శాంతి సందే శాన్ని వేదాంతపరంగా అందజేసిన బాబా ఫరీద్ క్రీస్తుశకం పన్నెండవ శతాబ్ది చివర షేక్ జమాలుద్దీన్ సులేమాన్, కర్సుం బీబీ అనే తల్లి దండ్రులకు జన్మించాడు. ఉపవాస మాసమయిన రంజాన్ నెలలో జన్మించటంవల్ల పుట్టగానే తల్లి దగ్గర పాలు తాగలేదు. ఉపవాస సమ యం ముగిసిన తర్వాతనే శిశువు తల్లిపాలు తాగడం చూచి తల్లిదండ్రు లకే ఆశ్చర్యం వేసింది. తండ్రి బాల్యంలోనే మరణించటంవల్ల తల్లి దగ్గరనే బాల్యం గడచింది. పరమ సాధ్వి అయిన తల్లి చిన్న తనం లోనే తన తనయునికి చిరం తన చైతన్య ధారలను స్తన్యపానంతో

పాటు చవిచూపింది. ఫరీదు జన్మనామం ఫరీదుద్దీన్ అత్తర్. జన్మ స్థానం ముల్తాను (పంజాబ్)కు దగ్గర కోత్వాల్. ఫరీదు పెరిగి పెద్ద వాడయిన తర్వాత పంచదారవంటి పలుకులతో పదిమందికి ఆనందక రంగా సంభాషించడం వల్ల అతనికి 'శకర్-గంజ్' అనే ముద్దు పేరు వచ్చింది. ఈ పేరు అతని మత గురువయిన ఖ్వాజా కుతుబుద్దీన్ భక్తి యార్ కాకీ తన ప్రియ శిష్యుడికి ప్రేమతో పెట్టాడని ప్రతీతి. ఆనాటి మహనీయులు కూడా ఫరీదుకు గల యీ వాగ్విభూతిని వేనోళ్ళకొని యాడేవారు. మీర్ ఖుర్ద్ అనే ప్రసిద్ధ కవి ఫరీదును సంబోధిస్తూ 'నీ చేతిలో రాళ్ళు రత్నాలవుతాయి, నీ నోటిలో విషం పీయూషమవుతుంద'ని అన్నాడు. సరస్వతీ వరప్రసాదం కలవాడు కాబట్టి ఫరీదు నోట వెలు వడిన పలుకులు పలు దిక్కులా ప్రసరించాయి.

బాబా ఫరీదుకు పరమ గురువయిన ఖ్వాజా ముయినుద్దీన్ చిస్తీ సంప్రదాయాన్ని స్థాపించిన సూఫీ గురువు. అజ్‌మేరును ప్రధాన పీఠంగా చేసుకొని పృథ్వీరాజు కాలంలో ఖ్వాజా ముయినుద్దీన్ సూఫీ సిద్ధాంతాలకు అనుగుణంగా ఈ సంప్రదాయాన్ని స్థాపించాడు. హిందు వులు, మహమ్మదీయులు, అనే భేదం లేకుండా భారతదేశంలో, ముఖ్యంగా అజ్‌మేరు పరిసరాల్లో ఉన్న సామాన్య ప్రజలందరూ, ముయినుద్దీన్ చేసే మత బోధను హితోపదేశంగా భావించి సేవించే వారట. సర్వజన సమారాధన కోసం ఏర్పడ్డ 'లంగర్' (అన్నదానం) అనే ఆచారాన్ని ప్రారంభించినవాడు ముయినుద్దీనే, పేద సాదలకు అన్నపానాలను ఏర్పాటు చేయడం మానవుల ప్రథమ కర్తవ్యం అని యిందులోని ఆంతర్యం. ఖ్వాజాముయిను బోధించి సాధించిన భూత దయను పురస్కరించుకొని అతన్ని 'గరీబ్-నిజాజ్' (పేదల పాలిటి పెన్నిధి) అనేవారు. ముయినుద్దీన్ శిష్యుడు కుతుబుద్దీన్ బఖ్తియార్. ఆనాడు ఢిల్లీని పాలిస్తున్న కుతుబుద్దీన్ ఐబక్‌కు సూఫీ ప్రవక్త కుతుబు ద్దీన్ బక్తియార్ అంటే చాలా అభిమానం. ఈనాడు ఢిల్లీలో మనకు కనిపించే కుతుబ్ మినార్ ఈ యిద్దరి స్మృతిచిహ్నమే. ముయినుద్దీన్

అజమేరులోనూ, అతని శిష్యుడు కుతుబుద్దీన్ ఢిల్లీలో ఉండడం బాగు లేదని గురువుగారే శిష్యుడి దగ్గరికి వచ్చి చేరడంతో చిస్తీ సంప్రదాయానికి ఢిల్లీ కేంద్రమయింది. అచిరకాలంలోనే ఈ గురు శిష్యులు షేక్ ఫరీదుద్దీన్ అత్తార్ (బాబా ఫరీదు జన్మనామం)ను చేరదీసి తమ సంప్రదాయానికి ఉత్తరాధికారిగా ఎన్నుకున్నారు. ఈ విధంగా బాబా ఫరీదు చిస్తీ సంప్రదాయాన్ని, సూఫీ సిద్ధాంతాలను, ఇస్లాం మతాన్ని ఆధారం చేసుకొని సర్వమానవ సంక్షేమానికి సంబంధించిన సత్యధర్మాలను చక్కెరలాంటి వాక్కులో పొందుపరచి తరతరాలకు అందేట్లు చేశారు.

బాబా ఫరీదు చేసిన బోధల్లో ప్రత్యేకంగా ఒక మతానికి మాత్రమే చెందగలదనే సంకీర్ణభావం ఎక్కడా కనిపించదు. ప్రపంచం-పరమాత్మ, జననం-మరణం, స్వర్గం-నరకం, వివేకం-వైరాగ్యం, ప్రారబ్ధం-పురుషార్థం, కష్టం-సుఖం, సంయోగం-వియోగం, వాసన-ఉపాసన లాంటి విషయాలను గురించే బాబా ఫరీదు అందరికీ అర్థమయ్యే భాషలో చెప్తాడు. పలుచోట్ల భగవద్గీతలో, ఉపనిషత్తులలో, సుభాషితాలలో చెప్పిన విషయాలు కనిపిస్తాయి. ఇది సూఫీకవి అన్నాడని ప్రత్యేకంగా చెప్తే తప్ప హిందువులకు అందులో హిందుత్వం, సిక్కులకు సిక్కుత్వం, మహమ్మదీయులకు మహనీయమైన భావమాధురి, క్రైస్తవులకు క్రీస్తు బోధించిన సువార్తలు, బౌద్ధ జైనులకు సత్యం-అహింస, ఇతర మతస్థులకు వారి వారి సిద్ధాంతాలు బాబా వాక్కులో ప్రతిబింబించినట్టు కనిపిస్తాయి.

ఒకచోట బాబా అంటాడు:

ఉసు ఊపరి హై మారగు మేరా
సైఖ్ షరీదా పంధు సంహారి సవేరా
(కత్తిమీది సాములాంటిది నా మార్గం
కడుమెలకువగా నడవలసిన మార్గం)

ఈ చరణాలు చదువుతుంటే "క్షురస్యధారానిశితా దురత్యాయా దుర్గం పథ స్తత్కవయోవదంతి" అన్న కఠోపనిషద్వాక్యం గుర్తుకు రాక మానదు. ఈ దుర్గమ మార్గాన చరించిన మహనీయులందరూ ఇలాగే అన్నారు.

మహనీయుల వాక్కు అన్ని దేశాల్లో, అన్ని కాలాల్లో ఒక ధోరణిలో ధారావాహికంగా పలుకుతూ వచ్చిందనే పరమ సత్యాన్ని బాబా ఫరీదు వాక్కు స్పష్టం చేస్తుంది.

మతంలోని ఆంతర్యం తెలియక మతం పేరిట మానవత్వాన్ని విస్మరిస్తున్న సమయంలో బాబా ఫరీదులాంటి భావయోగుల పద సంపదను పరిజ్ఞానంతో అవగాహనం చేసుకొని, ఆచరణలోనికి అనువదించుకొనడం చాలా అవసరం. అందుకే యీ ప్రయత్నం.

ఇందులో బాబా సుభాషితాలను కొన్నింటిని తెలుగు లిపిలో అందించి వాటికి సరళమైన తెలుగులో వివరణ కూడా పొందుపరచడం జరిగింది. ప్రపంచంలో ఏ మూల, ఏ భాషలో ఎలాంటి మంచి ఉన్నా దానిని సేకరించి తెలుగువారికి-ముఖ్యంగా యువతరానికి పంచి పెట్టేందుకు కంకణం కట్టుకున్న సాంస్కృతిక సారస్వత సంస్థ యువభారతి దీనిని ప్రచురించటం ముదావహమయిన విషయం.

భావయోగి బాబా ఫరీదు ప్రవచించిన యీ ప్రశస్త వాక్కు సర్వమత సామరస్యంకోసం పాటుపడుతున్న భారతీయులకు ఆనందం, ఆలోకం అందించగలదని ఆసిస్తూ.

విధేయుడు

ఇలపావులూరి పాండురంగరావు

## (సతిగుర్ ప్రసాది)

సద్గురు ప్రసాద సిద్ధిరస్తు

బోలై సేఖ్ ఫరీదు, పియారే అలహ్ లగే।
ఇహు తను హోసీ ఖాక్, నిమాణీ గోర్ ఘరే॥
ఆజు మిలావా సేఖ్ ఫరీద్, టాకిమ్।
కూంజడీయా మనహు మచిందడియా॥ రహాఉ॥
జేజాణా మరిజాయియే, ఘుమిన ఆయియే।
ఝూఠీ దునియాం లగి, న ఆపు వఞాయియే॥ 2॥
బోలియే సచుధరము, ఝూఠున బోలియే।
జో గురు దీసై బాట్, మురీదా జోలియే॥ 3॥
ఛైల్ లంఘదే పారి. గోరీ మను ధీరియా।
కంచన వన్నే పాసీ, కలవతి చీరియా॥ 4॥
సేఖ్ హైయాతీ జగిన, కోయీ థిరు రహియా।
జిసు ఆసణి హమ్ బైఠే, కేతే బైసి గయియా॥ 5॥
కతిక కూజాం చేతిడవు, సావణి విజులియాం।
సీయాలే సోహిందీయా, పిర్ గలి బాహడీజాం॥ 6॥
చలే చలణ్‌హార్, విచారా లేయి మనో।
గంఢేదియాం ఛియమాహ్, తుడందియా హికు ఖినో॥ 7॥
జిమీ పుఛై అసమాన్, ఫరీదా ఖేవట్ కిన్నిగయే।
జాలణ్ గోరా నాలి, ఉలామే జీయ సహే॥ 8॥

అష్టపదిలాంటి యీ కీర్తనలో బాబా ఫరీద్ సనాతన సత్యాన్ని సరళమైన భాషలో, సహజమైన శైలిలో అన్ని మతాలు చెప్పేది చివరకు ఇదే సనిపించేట్టు చెప్తాడు :

ఫరీదు మాటవినండి. పరమాత్మను సేవించండి. శరీరం శాశ్వతం కాదు. నశ్వరకాయం పిడికెడు బూడిదగా మారిపోతుంది. మట్టి మట్టిలో చేరిపోతుంది.

చంచలమయిన మనస్సును ఇంద్రియాలు స్వాధీనపరచు కుంటాయి. ఇంద్రియాలను లోబరచుకోగలిగితే క్షణంలో ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది.

ప్రతి జీవికీ మరణం తప్పదనీ, మరణించిన వాడు తిరిగిరాదనీ తెలిసి కూడా పరమార్థాన్ని విస్మరించి ప్రాపంచిక విషయవాసనల్లో మునిగి జీవితాన్ని వ్యర్థం చేసుకోవటం తెలివి తక్కువ.

నిజం చెప్పటం నీ ధర్మం. అబద్ధం అధర్మం. గురువు చూపించిన బాట కూడబెట్టని మూట. గురువు చెప్పిన మాట సాధకులకు ఊట.

భవసాగరం దాటిన పరమ యోగులను భర్త ననుసరించిచరించే పతివ్రతల లాగా భావవరులు అనుకరించి తరిస్తారు. పరమాత్మకుసంబంధించని పసిడివన్నెలు పదిదినాల పట్టపగలుగా వెలిగి నశించిపోతాయి.

జీవితంలో శాశ్వతమైనది ఏదీలేదు. పదవులను చూచి భ్రమించరాదు. మనం అలంకరించిన అధికారాలను ఇంతకు ముందు ఎందరో అనుభవించారు. అందరూ నశించారు.

ఋతుచక్రం నిరంతరం పరిభ్రమిస్తూ ఉంటుంది. వేసవిమండు టెండలను సహిస్తుంది. శ్రావణ సంధ్యలు మెరుపు తీగలను వెలయిస్తాయి. శారదేందిర చల్లని వెన్నెలను విరజిమ్ముతుంది. చలికాలం చెలిమి చలువలను చవిచూస్తుంది.

వెళ్ళవలసిన వాళ్ళు వెళ్ళిపోతారు. మనసు చిక్కబట్టి శేషించిన వాళ్లు జీవిస్తారు. ఒక్కక్షణం ఆలోచించు ఎంత కాలమో శ్రమించిఏర్పరచుకొన్న అందలం అరనిముసంలో కూలిపోతుంది.

ఎంతమంది నావికులు ఈ పాటికి దరిజేరారని భూమి ఆకాశాన్ని అడుగుతుంది. కొందరు గోరీలలో కుమిలి పోతున్నారనీ, మరికొందరు నవ్వుల పాలవుతున్నారనీ ఆకాశం సమాధానం చెప్తుంది. మరి తన సంగతి యేమిటో తానే చూచుకోవాలి.

ఈ యెనిమిది చరణాల్లో వేదనాదం మారు[మోగుతుంది. జీవిత పరమార్థం ధ్వనిస్తుంది. 'సత్యం వద,' 'ధర్మం చర-'లాంటి ఆదేశ వాక్యాలే కాక నశ్వర జీవితంలోని అవినశ్వర తత్త్వాన్ని అవగాహనం చేసుకొని అనుభవించి ఆనందించడం మానవధర్మమన్న సార్వత్రిక సందేశం 'కూడా ఈ గేయంలో శ్రుతి సుభగంగా వినిపిస్తుంది.

# భావాష్టకము

ప్రపంచం - పరమాత్మ

జననం - మరణం

స్వర్గం - నరకం

వివేకం - వైరాగ్యం

ప్రారబ్ధం - పురుషార్థం

కష్టం - సుఖం

సంయోగం - వియోగం

వాసన - ఉపాసన

## ప్రపంచం – పరమాత్మ

సభ్ నా మణి మాణిక్, ఠాహణు మూలి మచాంగవా।
జేతవు పిరియా దీసిక్, హియావు న ఠాహే కహిదా॥

అందరూ మణిమాణిక్యాల లాంటివాళ్ళే హృదయేశ్వరుడు అందరి హృదయాల్లో నివసిస్తాడు. కాబట్టి అందరి హృదయాలకూ ఆహ్లాదం కలిగేటట్టుగా మనం ప్రవర్తించాలి. ఎవరి హృదయాన్నీ నొప్పించ కూడదు. హృదయం నొచ్చుకుంటే హృదయేశ్వరుడు నొచ్చుకున్నట్టే.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే.... తిష్ఠతి"

ం ం ం

ఇకు ఫి కాస గాలాయి, సభనామై సచా ధణీ।
హియావుస కైహీ ఠాహి, మాణక్ సభ్ అమోలవే॥

సత్య స్వరూపుడు, సర్వాంతర్యామి అయినస్వామి అందరి అంతరంగంలో నెలకొని ఉంటాడు. కాబట్టి ఎవరినీ చులకనగా చూడకూడదు. చులకనగా మాట్లాడకూడదు. ఇతరులమనస్సు నొచ్చేమాటలు నోటరానీయకూడదు. అందరికీ ఆనందం కలిగే పద్ధతిలోనే అందరితో మాట్లాడాలి. ఎవరినీ దూషించరాదు. తూలనాడ కూడదు. అందరూ పరమాత్మ స్వరూపులే.

'అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం'- అన్నమాటల్లో గీతాచార్యుడు కీర్తించిన వాఙ్మయతపస్సు బాబాఫరీదు పలికిన యీ పదాల్లో ధ్వనిస్తూ ఉన్నది.

ఫరీదా కన్ని మునలా సూపుగలి, దిలి కాతీ గుడ్డ వాతి।
బాహరి దిసై చనణా దిల్ అంధియారీ రాతి॥

సన్న్యాసులందరూ సాధువులుకారు. అందులో కొందరు మోస గాళ్లు కూడా ఉంటారు. జింక చర్మం, కాషాయవస్త్రం ధరించినంత మాత్రాన వాళ్లు ధర్మాత్ములు కాలేరు. మంచి మంచి మాటలు కూడా తీపిగా ప్రీతిగా చెప్పవచ్చు. కాని హృదయాంతరాలలో చిమ్మ చీకటులు కమ్ముకొని ఉండవచ్చు. కావలసింది బయటి వెలుగుకాదు, లోపలి వెలుగు అంతరంగం ప్రధానం. బాహ్యవేషాలను చూచి భ్రమపడరాదు.

o o o

లమ్మీ లమ్మీ నదీ వహై, కంధీ కేరై హేతి।
బేడై నో కపరు కియాకరై, జే పాతణ్ రహైసుచేతి॥

కొండల్లో, కోనల్లో, గుట్టల్లో, మిట్టల్లో కుంటుపడని వేగంతో ప్రవహించేనదిలాగా దుఃఖవాహిని ప్రచండవేగంతో ప్రవహిస్తూ ఉంది. మంచితనాన్ని తలపించే గట్టును తెంచుకునేందుకు ప్రయత్నిస్తున్నది. కాని పడవ నడిపించేవాడు మెలకువగా నడిపిస్తే గాలివాలు కలిసివస్తే పడవకు ప్రమాదమేమీరాదు. ప్రపంచం నది. జీవితం నౌక. నడిచేది నరుడు. నడిపించేవాడు దైవం (నారాయణుడు) స్వామి అనుగ్రహం ఉన్నంతవరకు పడవలాంటి జీవితానికి ఏమీ ప్రమాదం జరగదు.

కంఘీ వహణ్ న ఢాహి, తవుభీ లేఖా దేవణా ।
జె దరి రబ్ రజాయి, వహణు తిదావూ గవుకరే॥

ప్రచండ వేగంతో ప్రవహిస్తూ, ఒడ్డును ఒరుసుకుపోతూ కట్టలు తెంచుకునేందుకు ప్రయత్నించే ఉద్దండనదిని సంబోధించి బాబా అంటాడు

"నది ! నీవు నీ కట్టను తెంచుకునేందుకు చూడకు. కట్ట తెగితే నీవు నీ ప్రవర్తనను గురించి సంజాయిషీ చెప్పుకోవలసి ఉంటుంది. నీ దారిన నీవు ప్రవహించు. మితిమీరిన పొంగుతో దారి తప్పకు, విశ్వ నియంత నియమించిన నీతి మార్గాన్ని అనుసరించటమే నీకు శ్రేయస్కరం.

○ ○ ○

ఫరీదా బురే దా భలాకరి, గుసా మని న హఢాయి।
దేహీ రోగున లగయీ పలై సభు కిచు పాయి॥

అపకారం చేసిన వాళ్ళకు కూడా ఉపకారంచెయ్యటం ఉత్తముల లక్షణం. ఎవరికీ కీడు తలపెట్టరాదు. ఏ పరిస్థితిలో కూడా కోప తాపాలకు లొంగిపోరాదు. ఇలా ప్రశాంతంగా జీవితం గడుపుతూ ఉంటే అంతటా మంచితనమే కనిపిస్తుంది. మనస్సు నిర్మలంగా ఉంటే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. సకల సిద్ధులూ క్షణంలో లభిస్తాయి.

"అపకారికి ఉపకారము నెపమెన్నక చేయవాడు నేర్పరి సుమతీ"-అన్న సుమతి వచనం ఈ సందర్భంలో స్మరింపదగినది.

ఫరీదా గలీ సు సజణ్ వహీ, ఇకు ఢూఢేదీ లహా౹
ఢుఢా జివు మాంలీహ, కారణి తిన్హా మాపిరీ॥

తియ్యని మాటలు చెప్పి సమయానికి తప్పుకునే స్నేహితులు ఎక్కడ పడితే అక్కడే దొరుకుతారు. కాని అక్కరకు వచ్చే ఆత్మీయులు మాత్రం ఎంత వెదకినా కనిపించరు. మనసు విప్పి చెప్పి మన సార ప్రేమించే మిత్రులకోసం బాబా మనస్సు పరితపిస్తూ ఉన్నదట. అలాంటి మిత్రులు లేకపోవటం వల్ల ఆయన హృదయం కుంపటిలా ఆవేదనతో రగులుకుని పోతున్నదట.

-౨-

ఫరీదా జంగలు జంగలు కియా ఫవహి వణి కండా మోడేహి౹
బసీ రవు హియాలియే, జంగలు కియా ఢూండేహి॥

స్వామి సర్వాంతర్యామి, అందరి హృదయాల్లో ఆయన నెలకొని ఉంటాడు. ఆయన్ని వెదకేందుకు అష్టకష్టాలుపడి అడవుల్లో తిరగవలసిన అవసరంలేదు. అరణ్యాల్లో ముళ్ళకంచెలు తప్ప మరేమీలేవు. కంటక సంకటాల్లో చిక్కుకొని అవస్థపడక హృదయంలో హృదయేశ్వరుని దర్శించుకో, పవిత్రమైన హృదయం పరమాత్మకు నిలయం.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే.... తిష్ఠతి"- అన్న గీతా వాక్యం ఇక్కడ స్మరణీయం.

ఫరీదా అఖీదేఖి పతీజీయాఁ సుణి సుణి రీణే కన్న।
సాఖ్ పకందీ ఆయియా హోర్ కరేందీ వన్న॥

దృశ్యమయిన ప్రపంచాన్ని చూచి చూచి కళ్ళు కాయలుకాచాయి. నానా నాద నినాదాలను విని చెవులు గింగురుమన్నాయి. పంటలా జీవితం పండింది. పచ్చని పైరు పసిడి వన్నెలను వెలయించింది. ఆ రూపం వేరు. ఈ రూపం వేరు. ఆ రంగువేరు, ఈ రంగువేరు. జీవి ఒకడే, జీవన విధానం వేరు.

)o(

ఫరీదా తినా ముఖ్ డరావణే, జినా విసారి ఓను నావు।
ఐథై దుఖ్ ఘణేరియా, అగ్గే ఠవురు న ఠాడు॥

భగవన్నామాన్ని విస్మరించిన వాళ్ళ ముఖం చూస్తేనే పాపం వస్తుంది. అలాంటి వాళ్ళ జీవితం ఇహానికీ, పరానికీ పనికిరాకుండా పోతుంది. ఇహలోకంలో సుఖానికీ, పరలోకంలో ఆత్మశాంతికీ-రెంటికీ దూరమయిన జీవితం వ్యర్థం.

నామ మహిమను బాబా ఫరీదు అనేక సందర్భాలలో కొనియాడుతాడు. భగవన్నామం భగవంతుని కంటె గొప్పదని మహనీయులు భావిస్తారు.

)o(

ఉఠ ఫరీదా ఉజూసాజి, సుబహ్ నివాజ్ గుజారి।
జో సిరుసాయీ నా నివై, సో సిరు కపి ఉతారి॥

ఉదయంలేచిపరమాత్మనుస్మరించటం ప్రతిమానవుని కర్తవ్యం. పరమాత్మకు భక్తితోనమస్కరించని శిరస్సు శిరస్సుకాదు. నమస్కరించని శిరస్సును ఛేదించటంమేలు.

"శేష శాయికి మ్రొక్కు శిరము, శిరము" అన్న పోతన పద్య పంక్తి ఇక్కడ స్మరణీయం.

○ ○ ○

## జననం – మరణం

ఫరీదా ఖిండీ మేఖా అగలీయా జిందు న కాయీ మేఖ్।
వారీ ఆపో ఆపణే చలీమసాయిక్ సేఖ్॥

శరీరమనే వస్త్రాన్ని చినగకుండా కాపాడుకునేందుకు నర నర్లాలలో లెక్కలేనన్ని కుట్లు, ముళ్లు ఉన్నాయి, ఇంత చక్కగా కుట్టిన శరీరం చెక్కు చెదరకుండా ఉంటుందేకాని ప్రాణాలను తనతో ముడి వేసుకోలేదు. గడువు పూర్తి కాగానే ప్రాణాలు శరీరానికి చెప్పకుండా లేచిపోతాయి. శరీరానికీ, ప్రాణాలకూ మధ్య ముడులు కానీ, కుట్లుకానీ ఏవీ లేవు. కనకనే మహావీరులూ, మహాత్ములూ కూడా ఆయువు ముగియగానే కాలంలో కలిసిపోతారు. మరణాన్ని ఎవ్వరూ తప్పించుకోలేరు.

○ ○ ○

పాని దమాయే ఛతు సిరి, ఖేరీ సడో రద్ ।
జాయినుత్తే జీతాణ్ మహి, ధీయే అతిమా గాడ్ ॥

ఒకవైపు నగారాలు మోగుతూ ఉంటే, మరోవైపు వందిమాగధులు ప్రశస్తిగీతాలు పాడుతూ ఉంటే ఛత్ర చామరాది రాజ లాంఛనాలతో తులదూగుతూ రాజభోగాలను అనుభవించే రాజాధిరాజులు కూడా యమధర్మరాజు పిలవగానే మరుక్షణం మట్టిలో కలిసి పోవలసినవాళ్ళే అందరూ తల్లి గర్భంలో తలదాచుకోవలసిన వాళ్ళే. జనన మరణాలు తప్పించుకోవటం సామాన్యులకేకాదు సమ్మాన్యులకు కూడా సాధ్యం కాదు.

o o o

ఘడీయే ఘడీయే మారియే, పహరీ లహై సజాయి ।
సోహేడా ఘడియాల్ జివు, డుఖీ రేణి విహాయి ॥

గంట గంటకూ జాము జామునకూ సుత్తె దెబ్బలు, సమ్మెట పోటులు అనుభవించే గడియారం లాంటిదే మన శరీరం. కాలంగడిచే కొద్దీ ఈ శరీరం నానా బాధలననుభవించి చివరకు కాలంలో కలిసిపోతుంది. ఈ రహస్యం గమనించి దైవదత్తమయిన యీ శరీరాన్ని స్వామి కైంకర్యానికి వినియోగించి శాశ్వత సౌఖ్యం సాధించటం సాధువుల కర్తవ్యం.

o o o

ఫరీదా మై భోలావా పగ్దా, మతుమైలీ హోయి జాయి।
గహిలా రూహున జాణయీ, సిరుభీ మిటీ ఖాయి॥

తలపాగ మాసిపోతుందేమోనని తలకు మాసిన సన్న్యాసి బాధ పడుతున్నాడట. తలపాగేకాదు, తల కూడా ఒకనాడు పిడికెడు బూడిదలో కలిసిపోవలసిందేననే పరమసత్యం ప్రాణికోటికి తెలియకపోవటం విచారణీయం. శరీర సౌఖ్యం, వేషభూషలు, భోగభాగ్యాలు - అన్నీ ప్రాణం ఉన్నంత వరకే శరీరం నశించిన తర్వాత పేరు ప్రతిష్ఠలు మిగులుతాయి. మిగిలినవన్నీ మట్టిలో కలిసిపోతాయి.

० ० ०

ఫరీదా ఖాక్ న నిందియే, ఖాకూ జేడు న కోయి।
జీవదియా పైరా తలై ముయ్యా ఊపరి హోయి॥

మట్టిని నిర్లక్ష్యం చేసి చులకనగా చూడకు. మట్టిలాంటి పదార్థం ప్రపంచలో మరొకటి లేదు. బ్రతికి ఉన్నంతకాలం అది మనుష్యుల కాళ్ళ క్రింద అణగిమణగి ఉంటుంది. మరణించిన తర్వాత అది మనిషిని కప్పికాపాడుతుంది.

మట్టిలాగా మంచిని పెంచిన మనిషి కూడా జీవితకాలంలో వినయ విధేయతలతో మెలగి మరణించిన తర్వాత మహోన్నత పదవిని పొందుతాడు. కైవల్య పదాన్ని చేరుకుంటాడు.

ఫరిదా జాం తపు ఖటణ్ వేల్, తాం తూ రతా దునీ సిపు।
మరగ్ సవాయీ నీహి, జాం భరిజా తాం లదియో॥

పుణ్యకార్యాలు చేసి పారలౌకిక సంపదను సమకూర్చుకొనవల సిన సమయంలో నీవు భోగలాలసతో కాలయాపన చేశావు. మరణం ఆసన్నమయిన అవసాన దశలో నీవు చేయదగింది ఏమీ లేదు. ఎంత నిలువ చేస్తే అంత విలువ వస్తుంది. గడచిన గడియలు తిరిగిరావు వెలుతురుండగానే ఇల్లు చక్కబెట్టుకోవడం వివేకుల లక్షణం.

ం ం ం

సాడేత్రై మణు దేహురీ, చలై పాణీ ఆని।
అయియో బందాదునీ విచి, వతి ఆసూణీ బన్ని।
మలకలమవుత్ జాం ఆవసీ, సభీ దర్వాజే భన్ని।
తిన్హాపియారియా భాయియాం అగేదితా బన్ని।
వేఖహు బందా చలియా చహు జణియాదై కన్హి।
ఫరీదా అమల్ జి కీతేటునీ విచి, దర్గహ్ ఆయే కమ్మ॥

మూడు మణుగులు తూగే మానవశరీరం అన్నపానాలతో పెరుగుతుంది. బ్రతికి నన్నాళ్ళు పుట్టెడు ఆలోచనలతో, గంపెడు ఆశలతో జీవితం గడుస్తుంది. కాని మృత్యుదేవత శరీరాల్ని ఆశించగానే ఆశలన్నీ అడుగంటుతాయి. పరలోకానికి ప్రయాణమయిన పార్థివ శరీరాన్ని బంధుమిత్రులు సాగనంపుతారు. నలుగురూ నాలుగువైపుల మృత కళేబరాన్ని మోస్తారు. కాయం కాటిమంటలో కలిసిపోతుంది. చివరకు మిగిలేది మంచితనం, మంచిమనసు, మంచిపనులు. పర లోకంలో పరమాత్మ నిలయంలో జీవాత్మపక్షాన సాక్ష్యం చెప్పేది జీవి చేసిన మంచిపనులుమాత్రమే. మిగిలినదంతా మిథ్య.

ఫరీదా దరీ ఆవై కన్నై బగులా, బైఠా కేల్ కరే।
కేల్ కరేదే హంఝ్‌నో, అచింతే బాజ్ పయే।
బాజ్ పయే తిసు రబ్ దే, కేలా విసరీయా।
జో మని చిత న చేతేనని, సో గాలీ రబ్ కీయా॥

నదీతీరంలో నడయాడే హంసలాగా జీవాత్మ సంసారనదీ ఒడ్డున ఆడుతూ కాలక్షేపం చేస్తూ ఉంటుంది. ఉన్నట్టుండి ఒకనాడు యమ ధర్మరాజు డేగలా వచ్చి హంసను ఎత్తుకు పోతాడు. పరమాత్ముని పిలుపురాగనే ఆటలూ, పాటలూ అన్నీ ఆగిపోతాయి. వెనకటి సంగతులన్నీ మరచిపోయి మరో ప్రపంచంలోకి తరలి పోవలసి వస్తుంది. అనంతుని లీలలు అవలీలగా మనకు అవగాహనంకావు. భగవంతుని మనోభావాలను మన మనస్సు ఊహించను కూడా లేదు. ఏ క్షణం ఏం జరుగుతుందో చెప్పలేము. ఎప్పుడు పిలుపు వస్తే అప్పుడు వెళ్ళవలసిందే. కాబట్టి సర్వకాల సర్వావస్థలయందును సర్వేశ్వరుని స్మరిస్తూ మెలకువతో మెలగటం మన విధి.

ఫరీదా గోర్ నిమాణీ సడుకరే, నిఘరియా ఘరి ఆవు।
సర్‌పర్ మైధే ఆవణా, మరణహు నా డరియాహు॥

పాడు గోరీ నన్ను పేరు పెట్టి పిలుస్తూవుంది. ఎలుగెత్తి అరుస్తూవుంది- ఎందుకలా నీడా గూడూ లేకుండా తిరుగుతావ్? ఇదిగో నీకు నీడనిచ్చే గూడు. ఇదే నీకు నికరమైన నిలయం. ఇక్కడికి వచ్చేందుకు భయపడవలసిన పనిలేదు. అందరికీ ఇదే ఆశ్రయం ఇస్తుంది. అందరూ చివరకు ఇక్కడికే చేరుకుంటారు.

"జాతస్య మరణం ధ్రువం"- అన్న పరమ సత్యాన్ని ఈ పద్యం ప్రతిపాదిస్తుంది.

ఫరీదా కిథై తైదే మాపియా, జిన్హీ తూ అణిఓహి।
తై పానహు ఓయి లది గయే, తూ అజైన పతీణోహి॥

కొంచెం ఆలోచించి చూడు. నిన్ను కని పెంచిన తల్లిదండ్రులు కొన్నాళ్ళ తర్వాత నీ దగ్గర ఉండక పోవచ్చు. ఆయువు ముగియగానే వాళ్ళ దారిని వాళ్ళు వెళ్తారు. రేపు మనం కూడా అంతే. ఈ ప్రపంచంలో ప్రతి ప్రాణీ ఏదో ఒకనాడు పరలోకానికి పయనించవలసిందే. గడచిన కాలాన్నీ రానున్న కాలాన్నీ ఒక్కసారి పరిశీలించి చూస్తే పరమసత్యం తెలుస్తుంది. ఇదిలోకపు తీరు, లోకనాయకుని తీర్పు.

"అనుపశ్యయథా పూర్వే, ప్రతి పశ్య తథాపరే". అన్న కఠసూక్తి ఈ పద్యంలో ధ్వనిస్తుంది.

○ ○ ○

ఫరీదా భన్నీ ఘడీ సవనవీ, టుటీ నాగరు లజు।
జో సజణు భుయి భారు థే, సే కివు ఆవహి అజు॥

మట్టికుండలాంటి యీ శరీరం ఒకనాడుపగిలిపోతుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాల సంధి సూత్రం ఒకనాడు తెగిపోతుంది. ఆ తర్వాత ఈ శరీరం మళ్ళీ కావాలంటే లభించదు. మానవ జన్మ చాలా దుర్లభమయినది. కష్టసాధ్యమయిన కాయం లభించినా దీనిని సరిగా ఉపయోగించుకోలేక కేవలం భూమికి భారంగా జీవించిన వాళ్ళు తర్వాత చాలా పరితపించవలసి ఉంటుంది.

ఫరీదా కోఠే మండప్ మాండియా ఏతున లాయే చితు।
మిటిపయిా అతోలవీ, కోయిా న హోసీ మితు॥

ఈ మేడలు, మిద్దెలు, ఇండ్లు, వాకిళ్ళు నీ వెంటరావు. ఎన్ని లోగిళ్ళలో ఎన్ని భోగాలను అనుభవించినా చివరకు చారెడు మట్టిలో చేరిపోవలసిందే. మరణించిన తర్వాత నీకాయాన్ని గోతిలోపాతి మట్టితో పూడ్చే సమయంలో నీ కెవ్వరూ తోడు రారు. నీ సంపద నీకూడా రాదు. కనక అవసరానికి పనికిరాని అందచందాలను, అందలాలను చూచుకొని మురిసిపోకు, అసలయిన లక్ష్యాన్ని మరచిపోకు.

ం ం ం

## స్వర్గం – నరకం

ఫరీదా పంఖ్ పరాహుణీ, దునీ సుహావా బాగు।
నవుబతి వజీ సుబహ్‌సిపు, చలణ్ కా కరి సాజు॥

ఈ ప్రపంచం రమణీయమైన ఉద్యానవనం. ఇందులో ఆనందంగా విహరించేందుకు వచ్చిన పక్షులే ప్రాణులు. ఈ పక్షులు కలకాలం ఇక్కడ ఉండేందుకు రాలేదు. ఉదయంకాగానే మరోచోటికి వెళ్ళేందుకు ప్రయత్నాలు సాగుతున్నాయి. వెళ్ళటం తప్పనిసరి అయినప్పుడు ఎంత త్వరగా బయలుదేరితే అంతమంచిది.

పార్థివ జగత్తు జీవాత్మకు మజిలీ మాత్రమే, చేరవలసిన చోటు మరోచోట ఉన్నది. విశ్రాంతి ప్రయాణాన్ని విస్మరింప జేయరాదు.

ఫరీదా మవుతై దా బన్నా ఏవై దిసై జివు దరియావై ఢౌహా।
అగ్గై దోజక్‌తపియా, సుణీయే హూల్ పవై కాహాహా।
ఇకనా నో సబ్ సోఝీ ఆయీ, ఇక్ ఫిర్‌దేబేపర్వాహా।
అమల్ జి కీతియా దునీ విచి, సే దర్‌గహ్ ఓ గాహా॥

నదీ వేగానికి ఒరుసుకుపోయే అంచున మృత్యువు నివసించి ఉంటుంది. మరణించిన తర్వాత పాపాత్ములు నరకలోకములో నరక యాతన అనుభవిస్తారు. స్వర్గ నరకాల తారతమ్యము తెలుసుకున్న పుణ్యజీవులు పుణ్యకార్యాలు చేసి పుణ్యలోకాలకు తరలిపోతారు, తరించి పోతారు. పామరులు పరలోకాన్ని గురించి పట్టించుకోరు. వాళ్ళకు నరకం తప్పదు. నరక యాతన తప్పదు. ఈ లోకములో మనం చేసిన మంచి మనకు పరలోకంలో పలుకుబడినీ, పెట్టుబడినీ అనుగ్రహిస్తుంది.

ం ం ం

ఫరీదా మను మైదానుకరి, టోయే టిబే లాహి।
అగ్గై మూలి న ఆవసీ, దోజక్ సందీ భాహి॥

మనస్సులో మిట్ట పల్లాలు లేకుండా సమతలం చేసుకో, మితి మీరిన మమకారం అణగద్రొక్కే ఆవేదన, విషంలాంటి ద్వేషం-మొదలయిన వికారాలకు మనస్సును గురిచేసుకోకు. నిర్మలమయిన మనస్సును నరకయాతన స్పృశించలేదు. కష్టసుఖాలను, లాభనష్టాలను, జయాపజయాలను సమదృష్టితో చూడగల మనసు తన స్వర్గాన్ని తానే సృష్టించుకుంటుంది. నరకం అలాంటి మనస్సుకు చాలాదూరం. ద్వేషభావమే నరకం, సామరస్యమే స్వర్గం.

"తన సంతోషమే స్వర్గము, తన దుఃఖమే నరక"మన్న మాట నిజం.

## వివేకం - వైరాగ్యం

ఫరీదా రాతి కథూరీ వండీయే, సుతియా మిలై త భావు।
జిన్హానైన నీంద్రావతే, తిన్హా మిలణుకువావు॥

సంసారికి రాత్రి సన్న్యాసికి పగలు, ప్రపంచం నిద్రపోయే సమయంలో పరమహంసలు మేల్కొని ఉంటాయి. ఎందుకంటే రాత్రిపూట పరమార్థపు కస్తూరి పరిమళం ఎక్కడినుంచో ప్రసరిస్తూ ఉంటుంది. ఆ కస్తూరి వాసనలు నిద్రపోయేవారికి సోకవు. మెలకువతో ఉన్నవారిని ఆ వాసనలు మురిపించి సర్వం మరిపిస్తాయి. మేలుకున్న వారికి మేలు. నిద్ర పట్టిన వారికి నష్టం.

"యానిశా సర్వభూతాని తస్యాం జాగర్తి సంయమీ"- అన్న గీతావాక్యం బాబా వాక్యానికి పరమ సన్నిహితంగా భాసిస్తుంది.

పహిలే పహిరై ఫుల్‌డా, ఫలు భీ పఛా రాతి।
జో జాగన్హి లహనిసే, సాయీ కన్నో దాతి॥

నిశాముఖంలో (సాయం సంధ్య తర్వాత) చేసిన పూజ పువ్వులా పరిమళిస్తుంది, ప్రభాత వేళలో (తొలి సంజకుముందు) చేసిన పూజ పువ్వులా పరిమళిస్తుంది. ప్రభాతవేళలో (తొలి సంజకుముందు) చేసిన పూజ పండులా ఫలిస్తుంది. వేకువ జామునలేచి భగవంతుని భావించి సేవించే పుణ్యజీవులకు భగవంతుడు ఈ పూజా ఫలాన్ని స్వయంగా ప్రసాదిస్తాడు.

ఇది ఫరీదు భావం. గురునానక్ దీనిని కొద్దిగా సవరిస్తూ హృదయపూర్వకమైన ఆరాధన ఏ సమయంలో చేసినా ఫలిస్తుందంటాడు. నిండు మనసులో తనను స్మరించిన తన వారిని భగవంతుడు నిద్రలేపి అనుగ్రహిస్తాడట. చిత్తశుద్ధి లేని జాగరణ నిష్ప్రయోజనమని నానక్ అభిప్రాయం.

కంధ్హి కుహాడ్డా, సిరి ఘడౌ, వణిక్తై సరు లోహారు।
ఫరీదా హావులోడీ నహు ఆపనా, తో లోడహి అంగియారు॥

ఒకనాడు ఫరీదు చెట్టుక్రింద చల్లని నీడలో కూర్చుని పరమార్థ చింతనలో నిమగ్నుడై ఉన్నాడు. అదే సమయంలో ఒకడు గొడ్డలి తీసుకొని చెట్టుకొట్టి కట్టెలు తీసుకుని వెళ్ళేందుకు వచ్చాడు. పరమాత్ముని ప్రేమామృతం ఎలా లభిస్తుందా అని ఫరీదు ఆలోచిస్తున్నాడు. వంట చెరకు ఎలా దొరుకుతుందా అని కట్టెలు కొట్టుకునేవాడు ఆలోచిస్తున్నాడు. ఇద్దరికీ ఆశ్రయమిచ్చింది చెట్టు ఒకరి తలమీద నీటి కుండ ఉంది. మరొకరితలలో ఆలోచనలు ప్రచరిస్తూ ఉన్నాయి. ఒకరికి కట్టెలు కావాలి. మరొకరికి సత్యం కావాలి. ఇద్దరినీ కలిపింది చెట్టు.

ం ం ం

బూఢా హోజా సేఖ్ ఫరీదూ. కవ్వణి లగ్గి దేహ్।
జే సవు వరియా జీవణ్, భీ తను హోసీ ఖేహ్॥

ముసలి తనంలో ముడతలుపడి వణకిపోతున్న శరీరాన్ని చూస్తే మనస్సులో వైరాగ్యం ఏర్పడుతుంది. వంద సంవత్సరాలు బ్రతికినా చివరకు మట్టి. మట్టిలోకలిసిపోవలసిందేననే విషయంకొంచెం ముందుగా కూడా అనిపించదు. అస్థిరమయిన శరీరం మీద మమకారం పెంచుకోవటం మంచిదికాదు. శరీరంలో పటుత్వం ఉన్నప్పుడే స్వామినిసేవించి జీవితం సార్థకం చేసుకోవటం మానవధర్మం.

ఫరీదా థీవు పవాహి దము జే సాయీా తోడహి సభు।
ఇకు ఛిజహి బియా లతాడీయహి తా సాయీా వైదరిబాడీయహి॥

పరమాత్మ సాన్నిధ్యం కావాలంటే ప్రభువునడిచే దారిలో గడ్డి పోచగా మారు. పెరిగిన గడ్డినికోసి ప్రభువు పాదాలకిందపరచి ఉంచితే ఆ చరణ సాంగత్యంతో గడ్డికి గర్వంపోయి అణకువ అలవడుతుంది. ప్రభువు కొలువులో చేరి స్వామి సాన్నిధ్యాన్ని అనుభవించేందుకు మరో మార్గంలేదు. వినయ విధేయతలతో అహంకారం చంపుకుంటేకాని అంతరాత్ముని అనుగ్రహం లభించదు.

ం ం ం

ఫరీదా రబ్ ఖజూరీ పకీయాం మాఖియ నయీా పహన్ని।
జో జో వంజై డీహడా సో ఉమర్ హథ్ పవన్ని॥

ప్రపంచంలోని భోగ పదార్థాలు పరమాత్మ అనుగ్రహించినవే. కమ్మని పండ్లు, చల్లని నీళ్ళు-అన్నీ భగవంతుని వరప్రసాదాలే. కాని యీ భోగాలను అనుభవించే కొద్దీ మన ఆయువు క్షీణిస్తుంది. ఎంత ఎక్కువ అనుభవిస్తే అంత తగ్గుతుంది ఆయుఃప్రమాణం. ఒకరోజు గడిస్తే మన ఆయుస్సులో ఒకరోజు తగ్గిందని తెలుసుకోవాలి. ఆయుస్సును క్షీణింపజేసే భోగ భాగ్యాలను తగ్గించుకొని భగవంతుడిచ్చిన ఆయుస్సును సద్వినియోగం చేసుకోవాలి.

"భోగా న భుక్తా వయమేవ భుక్తాః" అన్నట్టు భోగ భాగ్యాలను మనం అనుభవించటంలేదు. నిజానికి మనలనే అవి అనుభవిస్తున్నాయి.

ఫరీదా ఇహు తను భవుకణా, నిత్ నిత్ దుఖియే క్కౌణు।
కన్నీ బుజ్జే దే రహా‹ కితీ వగ్గై పౌణు॥

ఈ శరీరం కుక్కలా మొరుగుతుంటుంది. అది కావాలి, ఇది కావాలి-అని ఎప్పుడూ ఏదో వాగుతూ ఉంటుంది. దీని కోరికలు గొంతెమ్మ కోరికలు. అవి తీర్చటం మొదలు పెడితే వాటికి అంతుం డదు. ఈ బెడద తప్పించుకునేందు నేను రెండు చెవుల్లో దూది పెట్టుకు న్నాను. ఆ రొద నాకు వినిపించకపోతే ఆ బాధతీర్చవలసిన అవసరం కూడా లేకుండా పోతుంది. అలాగే వాగి వాగి దానంతట అదే నోరు మూసుకుంటుంది.

కోరికలు తీర్చటం కోరికలకు ఉపశమనకారి కానేరదని మహా భారతం తీర్పు. "నజాతు కామః కామానాం ఉపభోగేన శామ్యతీ : భోగా లను అనుభవించే కొద్దీ బోగలాలస పెరుగుతుందే కాని తగ్గదు.

o o o

మతి హోదీ హోయి ఇయాణా।
తాణ్ హోదే హోయి నితాణా।
అణహోదే ఆపు వండాయే॥

అన్ని తెలిసిన ధీశాలి అయికూడా తనకేమీ తెలియదనుకున్న వాడే వినయశీలి. అంతులేని బలవంతుడయినా తన బలం తాను తెలుసు కోలేనివాడు గుణశీలి. తనకున్న సంపదను తనతోటి వారికి రెండు చేతులతో పంచిపెట్టే వదాన్యుడే నిజమయిన భక్తుడు.

బుద్ధిబలం, దేహబలం, విత్తబలం-మూడూ పుష్కలంగా ఉన్న ప్పటికీ వాటిని లోకకల్యాణం కోసం వినియోగించేవాడే నిజమైన భక్తుడు. భగవదీయుడు.

)o(

ఫరీదా లోడ్ దాఖ్ బిజ్‌పురియా కి కరిబీజై జటు।
హండై ఉన్న కతావదా పైధాతాడే పటు॥

తుమ్మచెట్టు నాటి ద్రాక్షపండ్లు కావాలంటే ఎలా వస్తాయంటాడు బాబా ఫరీద్. ఎలాంటి మొక్కనాటితే అలాంటి చెట్టు పెరుగుతుంది. అలాంటి పండ్లు పండుతాయి. నాటింది తుమ్మ అయినప్పుడు బిజాపురం ద్రాక్ష కావాలంటే ప్రయోజనంలేదు. ఉన్ని నేసి పట్టుగుడ్డ కావాలంటే ఎలావస్తుంది ? ప్రారబ్ధం కొద్దీ ప్రాప్తి. చేసినవారికి చేసినంత.



ఫరీదా వేఫు కపాహై జి ధీయా, జి సిరిధీయా తిలాహా।
కమాదై అరు కాగదై, కున్నే కోయిలియాహ।
మందే అమల్ కరేదియా, ఏహ్ సజాయి తివాహ॥

ప్రపంచంలో ప్రతి వ్యక్తికీ ప్రారబ్ధం అనుభవించక తప్పదు. పత్తి చేసిన పాపమేమోకాని, దాన్ని పీకి పాకానబెట్టి ఏకులు చేస్తారు. దారం తీస్తారు. అలాగే నువ్వులను పిండి గానుగలో తిప్పి నూనె తీస్తారు. అదే విధంగా చెరకుగడ, కాగితం, మట్టికుండ, బొగ్గులు నానా బాధలకు గురి అవుతాయి. ఇందులో వాటి తప్పేమీ లేకపోవచ్చు. వాటి ప్రారబ్ధం అలావుంది.



## కష్టం - సుఖం

ఫరీదా మై జానియా దుఖు ముఝ్‌కూ, దుఖు సబాయియే జగి।
ఉచ్చే చడికై దేఖియా, తాఘరి ఘరి ఏహా ఆగి॥

ప్రపంచంలో కష్టాలు అందరికీ వస్తాయి. సుఖపడ్డ ప్రతి వ్యక్తీ కష్టాలు అనుభవించవలసిందే. కాని కష్టపడుతున్న వ్యక్తి తానొక్కడే కష్టజీవి ననుకుంటాడు. కాని కొంచెం తేరిపార చూచేసరికి అందరూ కష్టాలతో సతమతమవుతున్నట్టు తెలిసిపోతుంది. దుఃఖానలం ప్రపంచంలో అంతటా అలముకొని ఉన్నదనే సత్యం కొంచెం ఉన్నత స్థాయిలో ఆలోచిస్తేకాని తెలియదు.

○ ○ ○

రూఖీ సూఖీ ఖాయికై ఠండా పాణీ పీవు।
ఫరీదా దేఖి పరాయీ చొపడీనతరసాయే జీవు॥

కష్టపడి కామకొని తాగిన గంజి నీళ్ళేచాలు. సహజంగా లభించిన చప్పిడి మెతుకులు తిని గుక్కెడు నీళ్ళు తాగితే కడుపు చల్లబడుతుంది. ఇరుగు పొరుగువారు మృష్టాన్నంతిని తృప్తిగా తేపుతున్నారని వారిని చూచి అసూయపడకు. అవి నీకు లభించలేదని అణగారిపోకు, తనకున్న దానితో తనివి చెందటమే తన్నుదాను తెలుసుకున్న తెలుపరి లక్షణం.

ఫరీదా ఈతనా ఆటా అగలా, ఇక్ నా నాహీ లోణు।
అగై గయే సింపిసిని, చోటా ఖాఁసీ కాణు॥

ఒకడు భోగ భాగ్యాలతో తులదూగుతున్నాడు. మరొకడుఅన్నం లోకి అనుపాకం లేక, ఒక్కొక్కప్పుడు అనుపాకమే కాని అన్నంలేక, మరొకప్పుడు రెండూ లేక బాధపడుతున్నాడు. కాని సుష్ఠుగా మృష్టాన్నం తిని భుక్తాయాసంతో బాధపడేవాడు గొప్పవాడని చెప్పేందుకు వీల్లేదు. పరలోకంలో ఇద్దరి బండాళం బయట పడుతుంది. ఎవరికి గౌరవమర్యాదలు లభించేదీ, ఎవరికి శిక్ష విధించేదీ ఆనాడు తెలుస్తుంది. పార్థివ సంపద పరలోకంలో పనికిరాదు. అక్కడ అక్కరకు వచ్చేది మంచితనం.

ం ం ం

ఫరీదా సకర్ ఖండు నివాత్ గుడు,
మా కివు మాంఝూ దూదు।
సభే వస్తూ మిఠీయాఁ రవ్ న పూజని తుధు॥

పంచదార, కలకండ, తేనె, పాలు, బెల్లం అన్నీ ఒకదానికంటె మరొకటి మధురాతి మధురంగా ఉంటాయి. కాని భగవత్ పదార్థం (బ్రహ్మతత్త్వం) అన్నిటికంటె మధురమయినది. ఆ మాధుర్యాన్ని అందుకునేందుకు ఈ మధుర పదార్థాలు తోడ్పడవు. వీటి తీపి క్షణభంగురం. దివ్యనామామృతం తినగా తినగా తియ్యదనాన్ని, తియ్యని ఆనందాన్ని ప్రసాదిస్తుంది. క్షణభంగుర మాధుర్యానికి ప్రాల్బడకవర్గమ్ము రమణీయమైన ప్రసాదరసాన్ని ఆస్వాదించేందుకు పాటుపడు.

# సంయోగం – వియోగం

ఫరీదా గలీయే చికడు దూర్ ధరు నాలిపియారే నేహు।
చలా త భిజై కంబలీ రహాంత తుటై నేహు॥

ప్రియుని యిల్లు చాలా దూరం. దారికూడా సరియైనది కాదు. అన్నీ సందులు, గొందులు, ఎక్కడ కాలు పెడితే అక్కడ మొల లోతున బురదలో దిగబడిపోతుంది. కాని ప్రియుని కలుసుకొని తీరాలి. కప్పు కున్న దుప్పటి చప్పగా తడిసిపోయినా సరే, ప్రియుని యిల్లు చేరి తీరాలి. లేకుంటే ప్రియునితో ప్రేమానుబంధం తెగిపోతుంది. ఎలా గయినా ప్రియుణ్ణి చేరితీరాలి.

ం ం ం

కాగా కరంగ్ ఢఢోలియా, సగలా ఖాయ్యా మాసు।
ఏదుయిన్నైనా మతి ఛాహవు, పిర్ దేఖన్ కీ ఆసు॥

ఈ పాడు కాకులు నా శరీరంలో ప్రతికణాన్నీ గాలించి గాలించి నా రక్తమాంసాలను పీల్చి పిప్పి చేస్తున్నాయి. అయినా పరవాలేదు. నా రెండు కళ్ళు మాత్రం భద్రంగా ఉంటే చాలు. నా స్వామిని కన్ను లార చూచి ఆనందించేందుకు నాకీ రెండు నయనాలు చాలు,

పరమాత్మ మీద అనురాగం, ప్రాణాలపట్ల విరాగం సమాను పాతంగా హెచ్చుతాయని యీ కవిత సారాంశం. ప్రియదర్శనమే జీవిత పరమావధి, ప్రాణ సంరక్షణం కాదు. ప్రాణరక్షణ కూడా ప్రియ సందర్శనం కోసమే.

ఫరీదా చింత ఖటోలా, వాణుదుఖు, విరహా బిఛావణ్ లేపు।
ఎహు హమారా జీవణా। తూ సాహెబ్ సచే వేఖు॥

స్వామీ ! నా జీవితం నులకమంచంలా అయిపోయింది. ఈ మంచం అల్లేందుకు వాడిన నులకతాడు దుఃఖం. ఆర్తి, ఆశ, ఆవేదన, ఆందోళన మంచపు కోళ్ళు, విరహవేదన పక్కగుడ్డ, స్వామికి అన్నీ తెలుసు. సత్యమెరిగిన స్వామి సర్వాంతర్యామి.

o o o

బిరహా బిరహా ఆఖియే, బిరహా తూ సుల్తాను।
ఫరీదా జితు తన్ బిరహు న ఉపజై, సోతను జాణు మసాను॥

అందరూ విరహం, విరహం అంటారు. విరహం సామాన్యమయిందికాదు. వెయ్యి వరహాలు చేసే విరహం ప్రణయ జీవితాన్ని చక్రవర్తిలా పాలిస్తుంది. భావజగత్తులో విరహం ఏకచ్ఛత్రాధిపత్యం వహించి భావజీవులను శాసిస్తుంది. విరహం అనుభవించని జీవి జీవితం వ్యర్థం.

సూఫీతత్త్వంలో పరమాత్మ వియోగానికి ఎక్కువ ప్రాశస్త్యం ఉంది. ఈ వియోగాన్ని అర్థం చేసుకోలేని వాడికి యోగం సాధ్యపడదు యోగానికి ముందు వియోగం అవసరమని సూఫీయుల సిద్ధాంతం.

o o o

తతీ తోయిన పలవై, జే జలి టుబీ దేయ।
ఫరీదా జో దోహగణి. రబ్ దీ ఝూరేదీ ఝూరేయి॥

నీరు లేకుంటే పంట పండదు. కాని ఆ నీరే ఎక్కువ అయితే పంట పాడయిపోతుంది. అలాగే ప్రేమ జీవితానికి ఆధారం. కాని ప్రేమ విపరీతంగా పరిణమించినప్పుడు అది ప్రాణహానికి కూడా కారణం కావచ్చు. పరమాత్ముని ప్రేమకు నోచుకోని ప్రాణి ప్రేమ వంఛిత ప్రణయిని వలె పరితపించి నశించిపోతాడు.



జాకువారీ తా చావు, బీవాహీ తా మామలే।
ఫరీదా ఏహో పఛోతావు, వతికువారీ న థియే॥

ఆడపిల్లలకు పెండ్లి అయ్యేవరకూ ఎప్పుడు పెండ్లి అవుతుందా, ఎప్పుడు భర్తతో సుఖంగా ఉందామా అని ఉబలాటంగా ఉంటుంది. కాని తీరా పెండ్లయి అత్త గారింటికివెళ్ళిన తర్వాత కోటరికానికి సంబంధించిన చిరాకు పడలేక పెండ్లి కాకపోతేనే బాగుండేదనిపిస్తుంది. కాని సౌభాగ్యవతి అయిన తర్వాత కన్య కావటం సాధ్యంకాదు, అలాగే ప్రాపంచిక వాసనలను పరిత్యజించి పరమార్థ చింతనలో ప్రవేశించిన తర్వాత మళ్ళీ సంసారి కావటం, కావాలనుకోవటం అవివేకం.

సబర్ అందరి సాబరీ, తను పవై జాలేన్హి।
హోని నజీకి ఖుదాయిదై బేతు న కిసై దేన్హి॥

ఆత్మ సంయమంవల్ల ఆత్మ స్వరూపం తెలుస్తుంది. సంయమమే అగ్ని. సంయమాన్ని సాధిస్తే అన్నింటినీ సాధించినట్టే. సంయమాగ్నిలో సంయమీంద్రులు పార్థివ వాసనలను దహింపజేస్తారు. శరీరం కృశించినా ఆత్మ ప్రకాశిస్తుంది. సంయమధనులు తమ సాధన సంపత్తిని గురించి కాని సిద్ధిని గురించి కాని ఎవ్వరికీ చెప్పరు. చెబితే సిద్ధి క్షీణించి పోతుంది. కాబట్టి సిద్ధి పొందేందుకేకాక సిద్ధిని కాపాడుకునేందుకు కూడా సంయమం చాలా అవసరము.



సబరు ఏహు సు ఆవు, జేతూ౯ బందా దిడు కరహి।
వధి ధీవహి దరియాయి, టుటిన ధీవహి వాహడా॥

సంయమం, సహనం సాధకుని ప్రధాన లక్షణం. సంయమం వల్లనే లక్ష్యం సిద్ధిస్తుంది. దీక్షతో సంయమాన్ని సాధిస్తే పరబ్రహ్మ మనే పవిత్ర నదిలో చేరవచ్చు. బ్రహ్మభావం పొందిన తర్వాత మళ్ళీ జీవభావం ఉండదు. మహానదిలో చేరిన తర్వాత పిల్ల కాలువ కూడా మహానదిగా మారుతుంది. కాలువ నదిగా మారుతుంది. కాని నది కాలువగా మారదు. అలాగే సంయమ బలంతో సాధకుడు సిద్ధుడవుతాడు. సిద్ధి పొందిన తర్వాత సాధనకు అంత ప్రాధాన్యం ఉండదు. సంయమం సహజ సంపద అయిపోతుంది.

ఫరీదా దరవేసీ గాఖడీ, చోపడీ పరీతి।
ఇకని కిన్నై చాలీయై, దరవేసావీ రీతి॥

ఆధ్యాత్మిక జీవిత విధానం చాలా కష్ట సాధ్యమయినది. అనుకున్నంత సులభంకాడు, నిర్మలమయిన అంతఃకరణం, నిశ్చలమయిన దీక్ష, సహజమయిన సంయమం, అస్ఖలితమయిన అనురాగం ఉంటేనే కాని నిజమయిన సన్న్యాసం సాధ్యంకాదు. నూటికి కోటికి ఎవరో ఒకరు ఆలాంటి సన్న్యాలుంటారు. మిగిలిన వాళ్ళంతా బాహ్య సన్న్యాసులు. వేషభాషల్లో సన్న్యాస లక్షణాలు కనిపించినంత మాత్రాన లాభం లేదు. సర్వాత్మనా కామ్యకర్మ సన్న్యాసం చేస్తేనే నిజమయిన సన్న్యాసం అనిపించుకుంటుంది.

○ ○ ○

దేఖు ఫరీదా జు ధీయా సక్కర్ హోయిా విసు।
సాయిా బాఝుహు ఆపణే, వేదణ్ కహియే కిసు॥

వయసు మళ్ళే కొద్దీ మనసు ఎలా మారుతుందో గమనించండని ఫరీదు సాధకులను హెచ్చరిస్తాడు. కండ చక్కెర కాల కూటంగా మారుతుంది. ఆనాటి వినోదం ఈనాడు విషాదంగా పరిణమిస్తుంది. కాని యీ బాధ ఒకరితో చెప్పుకుంటే తీరేదికాదు. సర్వాంతర్యామి అయిన స్వామికి తప్ప మరెవ్వరికి చెప్పుకున్నా లాభం లేదు.

ఫరీదా కాలీ౯ జినీన రావియా, ధవులీ రావై కోయి।
కరిసాయీ సివు పిరహడీ, రంగునవేలా హోయి॥

వయసులోనే ప్రియుని సాంగత్యం సరసంగా సారస్యంగా ఉంటుంది. వయసు మళ్ళిన తర్వాత తొలకరి వయస్సును తలచుకొని నల్లవెంట్రుకలు తెల్లబోతాయి. కాని పరమాత్మునితో ఏర్పడిన ప్రేమ వయసు పెరిగే కొద్దీ క్రొంగ్రొత్త వన్నెలతో కళకళలాడుతూ ఉంటుంది. కాలం గడిచే కొద్దీ ఆ ప్రేమ పెరుగుతుందేకాని తరగదు. కాబట్టి చిన్న తనంనుంచే యీ చెలిమిని సాధించాలి.

ఈ సందర్భములో భవభూతి భావించిన అద్వైత భావపరిపాకం స్ఫురించక తప్పదు. 'అద్వైతం సుఖదుఃఖయోః,' 'కాలేనా వరణాత్యయా త్పరిణతో'యత్ స్నేహసారే స్థితం- లాంటి అమృత వాక్యాలను భావ యోగి బాబా ఫరీద్ అనువదిస్తున్నట్టు అనిపిస్తుంది.

о о о

ఫరీదా కాలీ ధవులీ సాహిబు సదాహై, జేకో చితికరే
ఆపణా లాయిజా పిరభు నలగయీ జో లోచై సభుకోయి
పహు పిరభు పియాలా ఖసమ్కా, జే భావై తై దేయి॥

వార్థక్యం ప్రేమకు ప్రతిబంధం కాదు. యౌవనములోనూ, వృద్ధాప్యంలోనూ ప్రభువు సర్వదా ప్రేమ పాత్రుడే. మనసార ప్రేమిస్తే చాలు, మనసిచ్చి మన్నిస్తాడు. కాని స్వామిని ప్రేమించి సేవించటము అందరికీ సాధ్యంకాదు. అందుకు స్వామి అనుగ్రహము కావాలి. ప్రేమ భగవంతుని వరప్రసాదం. ఆత్మీయులకు మాత్రమే ఆ ప్రసాదం లభి స్తుంది. ఇతరులకు ఎంత పరితపించినా ప్రాప్తించదు. అంతరాత్మకు అందరి ఆంతర్యం తెలుసు.

ఫరీదా కూకేదియా చాంగేదియా మతీ దేదియా నిత్।
జో సైతాని వాఙాయియా పే కిత్ ఫేరహి చిత్

పరి పరి విధాల పలుదిక్కులకు పరుగిడి ప్రాకులాడే మనస్సును మంచి మార్గానికి మరల్చేందుకు నేను చాలా ప్రయత్నించాను. గొంతు చించుకొని కేకలు పెట్టాను. నిత్యం నీతులు బోధించాను, కాని శనిపట్టిన మనస్సు నాహిత బోధను పెడచెవి పెట్టింది. లక్ష చెప్పు లక్ష్యం చెయ్యదు.

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్ దృఢం-" (చంచలమయిన మనస్సు మనిషిని మథన పెడుతుంది. అది చాల బలీయమయినది, గడుసుది) అన్న అర్జున వాక్యం ఇక్కడ గుర్తుకు వస్తుంది.



సాహురై ఢోయీ నలహై పేయియే నాహీ థావు।
పిరువాతడీ న పు ఛయీ ధన సోహాగణి నావు॥

ప్రతి జీవికీ ఇహలోకము పుట్టిల్లు, పరలోకము పతిగృహం. పుట్టింట్లో తావులేక అత్తింట్లో ఆదరం లేని యిల్లాలు భర్త దగ్గరకూడా పరువు ప్రతిష్ఠలు పొందలేదు. భర్తకు పనికిరాని భార్యను ప్రజలు కూడా చులకనగా చూస్తారు. అలాంటి స్త్రీ పేరుకు 'సువాసిని' కావచ్చును, కాని సౌభాగ్యం మాత్రము శూన్యము.

అలాగే ఇహం-పరం రెండూ సాధించగల సాధకుడే నిజమైన సాధువనిపించుకొంటాడు. లేకుంటే రెంటికి చెడ్డరేవడి అవుతాడు.

నాతీ ధోతీ సంవహీ, సుతీ ఆయిన చించు।
ఫరీదా రహీ సు బేడీ హిండుదీ, గయీ కథూరీ గంధు॥

పరమాత్మ ప్రేమకోసం పరితపించే జీవ వధువు శుభ్రంగా స్నానము చేసి చక్కగా అలంకరించుకొని హృదయేశ్వరుడు ఎప్పుడు వస్తాడా అని ఎదురుచూస్తూ కూర్చున్నది. ఇంతలో ఉన్నట్టుండి ఆమెకు నిద్ర ముంచుకు వచ్చింది. దానితో ఆమె చేసుకొన్న అలంకరణ అంత రించిపోయింది. కమ్మని కస్తూరి కంపుకొట్టసాగింది. ప్రియుడు వచ్చి కూడా ప్రయోజనం లేకుండా పోయింది.

విషయ వాసనలవయి మనసు మరలగానే పరమాత్మ మీద నిష్ఠ చలించి పోతుంది. కాబట్టి ఆధ్యాత్మిక సాదనలో ఆవగింజంత కూడా అజాగ్రత్త పనికిరాదు.



జీవన్ జాందే న డరా, జే సహ ప్రీతి న జాయి।
కితీ జీవన్ ప్రీతి బిను సుకి గయే కుమిలాయి॥

యౌవనం ఉడిగిపోతుందని నాకేమీ భయం లేదు. ప్రణయ మూర్తి అయిన పరమాత్మతో నాకు ప్రేమానుబంధం సుస్థిరంగా ఉంటేచాలు. నాకు కావలసింది ప్రేమ, యౌవనం కాదు. ప్రేమలేని యౌవనం నిష్ప్రయోజనం. ప్రేమకు నోచుకొని యౌవన కుసుమాలు ఏన్నో కుమిలి కుమిలి వాడిపోయాయి. అలాంటి యౌవనం నాకు అక్కరలేదు. పరమాత్మను ఆరాధించేందుకు ఉపయోగపడని అందం, అనురాగం నాకు అనవసరం, ప్రియుని ఆనందమే అందానికీ, అనురాగా నికీ పరమావధి.

ఫరీదా ఏ విసు గందలా, ధరీయా ఖండు ఖివాడి।
ఇకి రాహేదే రహి, ఇకి రాధీ గయే ఉజాడి॥

ప్రాపంచిక విషయవాసన పంచదారలో మాటుపెట్టిన చేదుటాకు లాంటిది. అసలు పదార్థం కటికచేదు. పైపూత తియ్యగా ఉంటుంది. పై తీపిని చూచి భ్రమపడి తీరా అసలు పదార్థాన్ని అనుభవించబోయే సరికి సిసలయిన చేదు బయటపడుతుంది. కొందరకు ఈ రహస్యం తెలియక మోసపోతారు. కొందరు ముందుగానే జాగ్రత్తపడి ఆ జోలికి వెళ్ళకుండా తరిస్తారు.

'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం' (పసిడి పాత్రలో సత్యం దాగి ఉన్నది) అన్న ఉప నిషద్వాక్యం ఈ సంద ర్భంతో స్ఫురిస్తుంది. ఆత్మయోగి పసిడి పూతలో సత్యాన్ని సాక్షాత్క రించుకుంటాడు. భావయోగి బాబాఫరీదు తియ్యని పదార్థంలో దాగిన చేదును పరిహరించుకుంటాడు అంతే భేదం.

○ ○ ○

ఫరీదా చారి గవాయియా హండికే, చార్ గవాయియా సమ్మి।
లేఖా రబు మంగేసియా తూ ఆహో కేర్హే కమ్మి॥

నాలుగు జాముల పగలు నలువైపుల తిరగటంతో గడిచి పోతుంది. రాత్రి నాలుగు జాములూ గాఢ నిద్రలో కలిసిపోతాయి. ఇక సాధించిందేముంది ? నిన్ను ప్రపంచంలోకి పంపించింది ఇందుకేనా అని ప్రభువు ప్రశ్నిస్తే నీవు ఏం సమాధానం చెప్తావని ఫరీదు ప్రాణి కోటిని ప్రబోధిస్తున్నాడు.

తిని తిరగటం, హాయిగా నిద్రపోవటం-ఇదే జీవిత పరమావధి కాదు. జంతువులన్నీ ఆపని చేస్తాయి. మరి మానవుడు సాధించిందేమిటి?

ఫరీదా నండీ కంతు న రావియో, వడీ ఢీ ముయ్యాసు।
ధన్ కూకేందీ గోర్ మేం, తై సహ మిల్యాసు॥

చిన్నతనంలోనే ఆధ్యాత్మిక సాధన చెయ్యాలి. ఎప్పుడో పెద్ద తనం వచ్చాక చూద్దామని తాత్సారం చెయ్యకూడదు. వయసులో చేసిన కాపురం రక్తికడుతుంది కాని ముసలితనం వచ్చాక ఎంతమంచి దాంపత్యమయినా మనస్సుకు తృప్తికరంగా ఉండదు.



ఫరీదా కోఠే ఘుకణు కేతడా, పిర్ నీ దడీ నివారి।
జో దిహ్ లధే గాణవే, గయే విలాడి విలాడి॥

జీవితమంతా ఉరుకులతో పరుగులతో గడచిపోతూ ఉంది. ఎన్నాళ్ళీ పరుగులు ? ఎంతవరకీ పయనం ? ఇంటికప్పు మీద ఎంత దూరం పరుగెత్తగలం ? పరమాత్ముని సాన్నిధ్యాన్ని దూరం చేసే పాడు నిద్రను మాను. ఆయువు పరిమితం, వృథాకాలయాపన చేయక జీవిత లక్ష్యాన్ని చేరుకునేందుకు ప్రయత్నించు.



కలర్ కేరీ ఛపడీ, ఆయి ఉలఝే హంఝ్।
చింజా బోడిన్ న పీవహి ఉడణ్ సందీ డంఝ్॥

మంచినీటి మానసంలో సంచరించేందుకు అలవాటయిన రాయం చలు ఉప్పునీటి కోనేటికి రావు. ఒకవేళ పొరబాటున వచ్చినా ఎక్కువ రోజులు అక్కడ ఉండవు. ఉప్పు నీటితో వాటి దప్పిక తీరదు. అంటీ అంటకుండా కొంతసేపు గడిపి సాధ్యమైనంత త్వరలో స్వస్థానం చేరు కుంటాయి.

అలాగే సాధకులయిన సాధువులు సాంసారిక జీవితం కొద్ది దినాలు గడపి పరమపదాన్ని చేరుకుంటారు. వాళ్ళ గమ్యం భోగం కాదు, యోగం, ప్రాపంచిక వ్యాసంగం మార్గ మధ్యలో మజిలీ.



ఫరీదా సాహిబ్ దీ కరి చాకరీ, దిల్ దీ లాహి భరాంది।
దర్వేసా నో లోఢియే, రుఖా దీ జీరాది॥

మనస్సులో లేనిపోని అపోహలు పెట్టుకోకు. చిత్త చాంచల్యాన్ని పోగొట్టుకొని చిత్తశుద్ధితో సర్వేశ్వరుని సేవించు. వైరాగ్య సంపన్ను లయిన సాధకులకు సహనం చాలా అవసరం. కదలక మెదలక కళ కళలాడే చెట్లు ఎండకు ఎండి, వానకు తడిసి ప్రపంచానికి పండ్లు, పూలు, గాలి, నీడ ప్రసాదిస్తాయి. అలాగే లోకకల్యాణం కోసం పాటు పడే సుజనులు సహనంతో నిర్మలమైన జీవితం గడుపుతూ తోటి మాన వులకు ఉపయోగపడే పనులు చేస్తారు.

ఫరీదా జిని కమ్మీ నాహి గుణ్, త కమడే బిసారి।
మతు సర్మిందా థీవహీ, సాయీం దై దరబారి॥

నీ గుణగణాలకు మెరుగుపెట్టలేని వ్యాసంగాలతో, వ్యసనాలతో జీవితాన్ని వమ్ము చేసుకోకు. పరమాత్మను రంజింప జేసే పనులు మాత్రమే చెయ్యి. మిగిలిన పనులు మానివెయ్యి, అలా చేస్తే పరమాత్మ సన్నిధిలో నీవు నిలబడినప్పుడు సిగ్గుపడవలసిన అవసరం లేకుండా పోతుంది. నేను ఫలానా పని చేశానని గర్వంతో సంతోషంగా చెప్పుకో గలుగుతావు.

ఆపు సవారహిమై మిలహి, మై మిలియా సుఖుహోయి।
ఫరీదా జేతూ మేరా హోయి రహహి, సభు జగు తేరా హోయి॥

ఆత్మ సాయుజ్యంలోని ఆనందానుభూతిని గురించి అంతరాత్మ జీవాత్మకు చెప్తుంది.

"నిన్ను నీవు చక్కబరచుకుంటే నేను నీకు దొరుకుతాను. నన్ను చేరేందుకు నీకు కావలసిందంతా ఆత్మశుద్ధి ఒక్కటే. నన్ను చేరిన తర్వాత ఆనందమే ఆనందం విషాదానికి తావు లేదు నాది ఆనందలోకం ఈ లోకంలో నీవు నావాడివిగా ప్రవేశించగలిగితే నీకు లోకమంతా లోకువ అయిపోతుంది.

నీవు భగవదీయుడవు కాగలిగితే భగవంతుడు భవదీయుడు కాగలడని బాబా ఫరీదు సాధించిన భావయోగానికి సారాంశం.

# యువభారతి మీ అభిప్రాయాల్ని ఆహ్వానిస్తున్నది

ఈ పుస్తకం చదివారు కదా ! మీ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా వెంటనే మాకు తెలిపి మా కృషిని ప్రోత్సహించండి.

'యువభారతి' నిర్వహిస్తున్న 'లహరీ' ఉపన్యాస కార్యక్రమాలతో మీరెప్పుడైనా పాల్గొన్నారా ? మీ అభిప్రాయమేమిటి ? భవిష్యత్తులో 'లహరీ' ఉపన్యాస కార్యక్రమాలు ఎలా ఉంటే బాగుంటాయని మీరనుకుంటున్నారు.

'యువభారతి' ప్రచురణలలో కొన్నింటినైనా మీరు చదివారా ? మీకు నచ్చిన లేక నచ్చని ప్రచురణలేవి ? ఇంకా ఎలాంటివి ప్రచురిస్తే బాగుంటుంది ?

సంస్థ శాశ్వత పథకాలయిన 'భారతీ మిత్ర', 'భారతీ భూషణ'లతో కాని, తాత్కాలిక సభ్యత్వ పథకమైన 'సాహితీ మిత్ర'లో గాని మీరు సభ్యులా? సంస్థ ప్రచురణలు సక్రమంగా మీకు అందుతున్నాయా ?

'యువభారతి' ప్రచురణలను మీ మిత్రులందరికీ పరిచయం చేయండి. యువభారతి ప్రచురణలను మీరు బహుమానాలుగా ఇవ్వండి. మీకు పరిచయమున్న, విద్యాసంస్థలచే కొనిపించండి.

"చుట్టూరా ఆవరించుకుని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకన్నా, ప్రయత్నించి చిన్న దీపాన్నయినా వెలిగించాలనేదే" 'యువభారతి' ధ్యేయం.

దూర ప్రాంతాల మిత్రులు, హైదరాబాదు వచ్చినప్పుడు తిలక్ రోడ్‌లోని 'ఆంధ్ర సారస్వత పరిషత్' భవనంలోని మన కార్యాలయానికి విచ్చేయండని ఆహ్వానిస్తున్నాం.

మీ సహకారాన్ని అర్థిస్తూ -

యు వ భా ర తి



మా తెలుగు తల్లికీ మల్లెపూదండ
మా కన్నతల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ

— శంకరంబాడి సుందరాచార్య